విడిప్రతిక ౧ అణా

# గోలకొండపత్రిక

102776

ప్రతి సోమ, గురువారములందు ప్రకటింపబడును

నం॥ చందా రూ. ౬ | నవంబరు ౧౨ వ తేదీ ౧౯౩౬ గురువారము | అర్ధ నం॥చందా రూ ౩

సంపుటము ౧౧ | తూపుబజారు, హైదరాబాదు - దక్కన్. | సంచిక ౫౩

శా. శ. ౧౮౫౮ = శ్రీధాతనం॥ ఆశ్వయుజ బ॥౮ గురువారము = ఫసలి ౧౩౪౬ ఫ.

## శ్రుతి స్మృతులలోని స్త్రీల పరిస్థితి

వ్యాసకర్త:—

జటావల్లభుల పురుషోత్తముగారు ఎం. ఏ.

### వివాహవిధానము

ఎనిమిది తెరగుల వివాహములు స్మృతులలో పేర్కొనబడినవి.

"బ్రాహ్మో దైవస్తథైవార్షః ప్రాజాపత్యస్తథాసురః గాంధర్వో రాక్షసశ్చైవ పైశాచశ్చాష్టమోఽధమః" [మను ౩-౨౧]

(బ్రాహ్మము, దైవము, ఆర్షము, ప్రాజాపత్యము, ఆసురము, గాంధర్వము, రాక్షసము, పైశాచము — అని వివాహ మెనిమిదివిధములు.)

ఇందొక్కొక్కదాని స్వరూప మెట్టిదనః

"ఆచ్ఛాద్య చార్చయిత్వా చ శ్రుతశీలవతే స్వయం ఆహూయ దానం కన్యాయా బ్రాహ్మో ధర్మః ప్రకీర్తితః యజ్ఞే తు వితతే సమ్యగృత్విజే కర్మ కుర్వతే అలంకృత్య సుతాదానం దైవం ధర్మం ప్రచక్షతే ఏకం గోమిథునం ద్వే వా వరాదాదాయ ధర్మతః కన్యాప్రదానం విధివదార్షో ధర్మః స ఉచ్యతే సహోభౌ చరతాం ధర్మమితి వాచానుభాష్య చ కన్యాప్రదానమభ్యర్చ్య ప్రాజాపత్యో విధిః స్మృతః జ్ఞాతిభ్యో ద్రవిణం దత్త్వా కన్యాయై చైవ శక్తితః కన్యాప్రదానం స్వాచ్ఛంద్యాదాసురో ధర్మ ఉచ్యతే ఇచ్ఛయాఽన్యోన్యసంయోగః కన్యాయాశ్చ వరస్య చ గాంధర్వః స తు విజ్ఞేయో మైథున్యః కామసంభవః హత్వా భిత్త్వా చ ఛిత్త్వా చ క్రోశంతీం రుదతీం గృహాత్ ప్రసహ్య కన్యాహరణం రాక్షసో విధిరుచ్యతే సుప్తాం మత్తాం ప్రమత్తాం వా రహో యత్రోపగచ్ఛతి స పాపిష్ఠో వివాహానాం పైశాచశ్చాష్టమోఽధమః"

[మను ౩-౨౭ నుండి ౩౪ వఱకు]

[వేదములను చదివి చక్కని శీలముగలిగియున్న వానిని పిలిచి వస్త్రాలంకారాదులచే పూజించి యట్లే పూజింపబడిన కన్యను వానికిచ్చినచో నది బ్రాహ్మవివాహమగును. ఇది ధర్మ్యము. యజ్ఞమందు ఋత్విజము చేయువానికి నాలంకృతకన్యాదానము చేయుచో నది దైవవివాహమనబడును. ఇదియు ధర్మ్యమే. ఒకటి గాని రెండు గాని గోమిథునములను యాగాదిసిద్ధికై వరుని నుండి తీసుకొని విధ్యుక్తముగా కన్యాదానము చేయుచో నార్షవివాహమగును. అదియు ధర్మ్యమే "మీరిరువురు గలసి ధర్మమాచరింపుడు" అని నియమము చేయుచు సాలంకృతకన్యాదానము చేయుచో నా వివాహమునకు ప్రాజాపత్యమని పేరు. మఱొక స్త్రీని వివాహమాడరాదనుటయే యీ నియమములోని విశేషము. కన్యకును జ్ఞాతులకును శక్తికొలది ధనమునిచ్చి కొని, కన్యను స్వీకరించుచో నది యాసురవివాహమగును. కన్యావరులు కోరుకొని పరస్పరము పొందుట గాంధర్వవివాహము ఇది భోగప్రధానము. కామమువలన బయలుదేరినది. కన్యయొక్క బంధువులను చంపి నరికి, కొట్టి యేడ్చుచున్న కన్యను పితృగృహము నుండి బలవంతముగ తీసికొనిపోవుట రాక్షసవివాహమనబడును. నిద్రపోవుచున్న దానిని, ఒడలు తెలియకున్న దానిని, పిచ్చిదానిని నేకాంతముగ పొందుట పైశాచవివాహము (ఇది వివాహములన్నిటిలో పాపిష్ఠము.)

అపస్తంబుడును వశిష్ఠుడును ప్రాజాపత్యపైశాచములను పేర్కొనలేదు.

చాలమంది స్మృతికారులు బ్రాహ్మదైవార్ష ప్రాజాపత్యములను నాల్గువిధములవివాహములను ప్రశస్తములని చెప్పియున్నారు.

"చత్వారో ధర్మ్యాః ప్రథమాః" (గౌతమ ౪-౧౪)

"ఏషాం తు ధర్మ్యాశ్చత్వారో బ్రాహ్మాద్యాః సముదాహృతాః" (నారద ౧౨-౪౪)

"ఏతే ధర్మ్యాస్తు చత్వారః" [లిఖిత ౪-౩]

ఇవి కాక క్షత్రియులకుమాత్రము గాంధర్వ రాక్షసములుకూడా ధర్మ్యములే యగుచున్నవి.

"గాంధర్వో రాక్షసశ్చైవ ధర్మ్యౌ క్షత్రస్య తౌ స్మృతౌ" [మను ౩-౨౬]

వివాహము ప్రశస్తమైనదగుచో సంతానము కూడ ప్రశస్తమైనదగును. వివాహము చెడ్డదగుచో సంతానముకూడా చెడ్డదగును. ఆయా వివాహములవలనగల్గిన సంతానముల ప్రాశస్త్యము గౌతమవసిష్ఠులు తమలో నీక్రిందివిధముగ పేర్కొనబడినది.

"త్రీనార్షాత్, దశ దైవాత్, దశైవ ప్రాజాపత్యాత్, దశపూర్వాన్ దశాపరాన్ ఆత్మానం చ బ్రాహ్మీపుత్రో బ్రాహ్మీపుత్రః (గౌతమ ౪-౩౨)

(ఆర్షవివాహమువలన మూడు పురుషములు పవిత్రములగును. దైవవివాహమువలన పదిపురుషములు పవిత్రములగును. ప్రజాపత్యవివాహమువలనగూడ పదిపురుషములు పవిత్రములగును. బ్రాహ్మవివాహము వలన గల్గిన కుమారుడు పదితరములు క్రిందివానిని పదితరములు పైవారిని పవిత్రులనుగ జేయును.]

కన్యాశుల్కమిచ్చి తెచ్చుకొనిన భార్య ధర్మకార్యముల కక్కఱరాదు.

"క్రయక్రీతా చ యా కన్యా పత్నీ సా న విధీయతే తస్యాం జాతాః సుతాస్తేషాం పితృపిండం న విద్యతే." (అత్రి ౨౩౪)

(ధనముచే కొనబడిన స్త్రీ పత్ని కానేరదు. ఆమెయందు జనించినవారికి పిండప్రదానము కూడ నుండదు.)

(బ్రాహ్మదైవార్ష ప్రజాపత్య వివాహములలో నాల్గు ప్రధానాంశములుండును. ౧. కన్యాదానము ౨. పాణిగ్రహణము ౩. సప్తపది ౪. సమావేశనము. ఇందొక్కొక్కదానివలన నొక్కొక్క ప్రయోజనముగలదు. దానమువలన కన్య పితృవశమువదలి భర్త్రధీనయగును.

"ప్రదానం స్వామ్యకారణం" [మను ౫-౧౫౨]

[ప్రదానము వరునకు వధువుపై స్వామ్యము గల్గుటకు కారణము]

కన్యాదానమాత్రమున వివాహమైనట్లు భావింపరాదు. కన్యాదానమైనను, నితరవివాహాంగములు కానిచో, వరుడు మరణించునో నాకన్యను మఱొకనికీయవచ్చునని వసిష్ఠుడు చెప్పుచున్నాడు.

"అద్భిర్వాచా చ దత్తాయాం మ్రియేతాథో వరో యది న చ మంత్రోపనీతా స్యాత్ కుమారీ పితురేవ సా." [వసిష్ఠ ౧౭-౧౨]

[కన్యయుదకముచేతను, వాక్కుచేతను నీయబడినదై మంత్రసంస్కృత కాకుండగనే భర్త మరణించినచో నామె తండ్రికే చెందును.]

దానము జరిగినవెనుక మిగిలిన వివాహభాగము జరుగకుండ వరుడు దేశాంతరగతుడై వాని జాడ తెలియకపోయినయెడల కన్య మూడు ఋతుకాలములు వేచి మఱొకని వివాహమాడవచ్చునని నారదుడు చెప్పుచున్నాడు.

"ప్రతిగృహ్య చ యః కన్యాం వరో దేశాంతరం వ్రజేత్ త్రీనృతూన్ సమతిక్రమ్య కన్యాన్యం వరయేద్వరం" [నారద ౧౨-౨౪]

ఇట్టికన్యకు సామాన్యవివాహము చేయుటకు మనువు సమ్మతింపలేదు. నియోగమువంటి యొక విలక్షణవివాహము చేయుట కాతడు సమ్మతించినాడు. ఉదకపూర్వకదానము మాట నటుండ కేవలవాగ్దానము జరిగినప్పటికిగూడ మఱొకని వివాహమాడుట కాతడు సమ్మతింపలేదు.

"యస్యా మ్రియేత కన్యాయా వాచా సత్యే కృతే పతిః తామనేన విధానేన నిజో విందేత దేవరః యథావిధ్యధిగమ్యైనాం శుక్లవస్త్రాం శుచివ్రతాం మిథో భజేతాప్రసవాత్ సకృత్సకృదృతావృతౌ" [మను ౯-౬౯, ౭౦]

[వాగ్దానపతిని కోల్పోయిన స్త్రీని నామె మఱది యీ విధముగ వివాహమాడవలెను. ఆమె నాతడు యథావిధిగ వివాహమాడి శుక్లవస్త్రయు, మంచినియమములు గలదియునగు నామెను నొక పుత్రుడు గల్గువఱకును ప్రతిఋతుకాలమునందును నొక్కొక్కసారి పొందుచుండవలెను.

ఆమె నాతడు ఋతుకాలములలో నొక్కొక్కసారి పొందవలెనను నియమముండుటచేతను, నొకసంతానము గల్గువఱకు మాత్రమే యామె నాతడు పొందవలెనని చెప్పబడుటచేతను నిది సామాన్య వివాహము కాదనియు వివాహసంస్కారముతో కూడిన నియోగమనియు స్పష్టముగ తెలియుచున్నది. వానికిగల్గిన కుమారుడు చనిపోయినవానికే చెందునని గ్రహించుకొనవలెను.

ఈవిధముగ మనువు మతములో వాగ్దానమైనంతమాత్రముననే కన్యావరులకు కొంత భార్యాభర్తృ సంబంధమేర్పడునని తెలియుచున్నది. ఇది పూర్ణమైన భార్యాభర్తృసంబంధము కాదనిమాత్రము తెలిసికొనవలెను. పూర్ణమగుభార్యాభర్తృసంబంధము గల్గినప్పటికి పతి చనిపోయినచో నపుత్రికయగు విధవ చేసికొను నియోగములో నిచ్చటవలె వివాహసంస్కారముండదు. కాన నిది దాంపత్యసదృశమును, దాంపత్యభిన్నమునునగు నొక విలక్షణసంబంధము. ఆ చనిపోయిన పురుషుడాపిల్లకు పతిభిన్నుడును, పతిసదృశుడును నగుచున్నాడు. అట్టిపతిభిన్నపతిసదృశునకు "అపతి"యని పేరు. పరాశరుని మతములో నట్టియపతి మృతుడైనమాత్రముననే కాక నష్టుడైనను ప్రవ్రజితుడైనను, క్లీబుడైనను పతితుడైననుగూడ స్త్రీ మఱొకనిభర్తనుగ బొందవచ్చును.

"నష్టే మృతే ప్రవ్రజితే క్లీబే చ పతితే పతౌ పంచస్వాపత్సు నారీణాం పతిరన్యో విధీయతే"

[అపతి దేశాంతరగతుడై తిరిగిరాకపోయినను చనిపోయినను, సన్న్యాసియైనను, నపుంసకుడైనను, పతితుడైనను—ఈయైదాపత్తులలోను స్త్రీలు మఱొకని పతినిగ పొందవలెను]

వివాహాంగమైన దానముయొక్కయు వాగ్దానముయొక్కయుగూడ వర్ణమును ప్రాముఖ్యమును చూచియున్నాము. ఈదానము చేయవలసినవారెవరనగా యాజ్ఞవల్క్యు డిట్లు చెప్పుచున్నాడు.

"పితా పితామహో భ్రాతా సకుల్యో జననీ తథా కన్యాప్రదః పూర్వనాశే ప్రకృతిస్థః పరః పరః"

[తండ్రి, తాత, భ్రాత జ్ఞాతి, తల్లి—వీరిలో పైవారులేనిచో క్రిందివారు కన్యాదానము చేయవలెను.]

పాణిగ్రహణము వివాహాంగమువలన గల్గు ప్రయోజనమేమనగా ఆమె పతితోకలసి యజ్ఞకర్మలను చేయు నధికారము గల్గును.

"పాణిగ్రహణాద్ధి సహత్వం కర్మసు" [బౌ. ధ. సూ. ౧౧-౧౪-౧౨]

పాణిగ్రహణమంత్రములే భార్యాభర్తృ సంబంధమును గలుగజేయును.

"పాణిగ్రహణికా మంత్రా నియతం దారలక్షణం" [మను ౮-౨౨౭]

ఈమంత్రములకు స్థిరత్వము సప్తపదితో గలుగును.

"తేషాం నిష్ఠా తు విజ్ఞేయా విద్వద్భిః సప్తమే పదే" (మను ౮-౨౨౭)

మఱియు

"స్వగోత్రాద్భ్రశ్యతే నారీ ఉద్వాహాత్సప్తమే పదే భర్తృగోత్రేణ కర్తవ్యం దానం పిండోదకక్రియా" [లిఖిత ౧-౨౨]

[వివాహములో సప్తపదియైనతరువాతనే వధువు పితృగోత్రమునుండి భ్రష్టయగుచున్నది. పిమ్మట దానము, పిండోదకక్రియ మున్నగువానిని భర్తృగోత్రముతోనే చేయవలయును]

వివాహమునకు చరమాంగమైన సమావేశనము వధువు ప్రాప్తవయస్కయగునప్పుడే కాయికముగను (ప్రాప్తవయస్క కానిచో కేవలమంత్రయుక్తముగను జరుగవలెనని స్మృతికారుల యభిప్రాయమైనట్లు గన్పట్టుచున్నది. ఈరెండువిధములైన సమావేశనములును గృహ్యసూత్రములలో స్పష్టముగనున్నవి వాని నాధారముగ జేసికొ

(౧౦వ పేజీ చూడుడు)

# దేశభక్త వామననాయకుని నిర్యాణము

## హైదరాబాదు ప్రజలందరి సంతాపము

గడచె ౧౩౪౬ ఫ. (౯ నవంబరు ౧౯౩౬) నాడు దేశభక్త వామననాయకుగారు ఉదయము ౯॥ గంటలవేళ పాంచభౌతికదేహమును బాసి పరలోకగాములైరి. సుమారు మూడువారములనుండి వాత వ్యాధిప్రకోపముచే బాధపడుచుండిరి. ఆనాడు బాలనయముగానే యున్నదనియు, రాత్రిబాగుగా నిద్రపట్టినదనియు చెప్పుచు ఉదయము ౮॥ గంటలవేళ ఔషదము పుచ్చుకొని ద్రాక్షపండ్లు తినియుండిరి. వెంటనే దౌర్బల్యము అధికమై హృదయము ఆగిపోయెను. మహోపకారియు, నిరుపమాన దేశాభిమానియు, నిజాంరాష్ట్రములోని హిందూప్రజలకు ప్రాణసమానుడును, వివిధసంస్థలకు పోషకుడును, అనేక విద్యాసంస్థల స్థాపకుడును నగు సిమ్మతశీలుడు ఈలోకమును, "ముక్తేశ్వరము" అను బేగంపేటలోని సౌంధమున ప్రాణములబాసెను!

### బేగంపేటలో

ఈవార్త వెంటనే సికింద్రాబాదులోను, హైదరాబాదులోను దావాగ్నివలె వ్యాపించెను. వారిచే స్థాపింపబడి, వారియభిమాన సంస్థయగు, వివేకవర్ధనీ హైస్కూలు మూయబడెను. బాలికల ఉన్నతపాఠశాల, పరోపకారిణీబాలికాపాఠశాల, ఇవియేల? విద్యాసంస్థలువెన్నియో వారి గౌరవార్థము మూయబడినవి. హైకోర్టు ప్రధాన న్యాయాధిపతిగారున్నాయమూర్తులందరు కోర్టులో వారిమొక్కదమలను మార్పవలసినదని హుకుముఇచ్చిరి. ఆర్యసమాజము, వివేకవర్ధనీ, ఆంధ్రజనసంఘము మున్నగువానిపక్షమున ప్రకటనలు ముద్రితములై పంచిపెట్టబడెను. సుమారు ౧౧ గంటలవరకు జనసమూహముల తండోపతండములుగ బేగంపేటలోని "ముక్తేశ్వరమున" ప్రోవు కాసాగెను. మహా ధనవంతులును కోటీశ్వరులునగు రాజా ధనరాజగిర్జీ గోస్వామి రాజా పన్నాలాలు బన్సీలాలుగారినుండి మొదలిడి సాధారణమైన బీదప్రజలుకూడ నగరమునుండి మైళ్లు ప్రయాణముచేసి అచ్చటికివచ్చిరి. నాయకుగారి మృతకళేబరమును ఒక్కొక్కరు మేడమీదికివెళ్లి దర్శించిరి! వారి అన్నకుమారులును విఖ్యాత దేశనాయకులును అగు శ్రీయుత రామచంద్రనాయకుగారు వచ్చినవారందరికిని మృతనాయకుని ముఖావలోకనము చేయించిరి. శవము బేగంపేటనుండి పగలు రెండుగంటలవరకు హైదరాబాదులోని వివేకవర్ధనీ హైస్కూలు మైదానములోనికి తీసికొని సికింద్రాబాదులోనుండి ఊరేగింపు తేబడుననియు, అచ్చట మృతకుని గౌరవము వివిధసంస్థలపక్షమువను అచ్చట జరిగినతరువాత మరల బేగంపేటలోనికి కళేబరము ఊరేగింపుతో గొనివచ్చి వారితోటలో దహనసంస్కారము గావింపబడుననియు నిర్ణయము తెలుపబడెను!

### వివేకవర్ధనీ మైదానములో

రెండుగంటలవేళ కాకపూర్వమే, నగరములోని ధనాధికులు, విద్యాధికులు, అధికారులు, అధికారేతరులు, విద్యార్థులు, స్త్రీలుపురుషులు, హిందువులు, మహమ్మదీయులు క్రైస్తవులు, పారసీకులు, అందరును వేలకొలది గుమిగూడిరి. స్త్రీలు వందలకొలది పాఠశాలభవనముపైన కూర్చుండియుండిరి. దారిపొడుగునవున్న బంగళాలపైన జనము గుమిగూడిరి. మైదానములో వచ్చినవారికి బెంచీలు కుర్చీలు అమర్చబడెనుకాని అవి ఏమూలకువచ్చును. ఈ విధముగా పోగైనవారిసంఖ్య ౨౦ వేలకంటెతక్కువయుండదని ఊహ!

సుమారు ౩½ గంటలవరకు దేశభక్తుని కళేబరము మోటారుబండిపై గొప్ప ఊరేగింపురూపమున, ప్రజాసమూహము వెంటరాగా, సగౌరవముగా జనమధ్యములోని ప్రత్యేకముగా సిద్ధము చేయబడిన పీఠమువరకు తీసికొనిరాబడి, మోటారునుండి పైకెత్తి ఆపీఠముపైన నుంచబడెను. దానిపైన వందలకొలది పుష్పహారములు నిండియుండె, ముఖముమాత్రము కానవచ్చుచుండెను. వెంటనే ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటక, మార్వాడి, గుజరాతి మొదలగుభాషల విద్యాసంస్థలును, జనసంఘములు, సాంఘిక, రాజకీయ, సాహిత్య మతసంస్థలును, విద్యార్థి వసతిగృహములును, మొత్తము వీనిసంఖ్య ౧౦౦ కంటె హెచ్చుగానుండి వానిపక్షమున పుష్పహారములు ఆయాసంఘములలో ప్రతినిధులవలన సమర్పింపబడెను. గొప్పగొప్ప వ్యక్తులు, రాజాబహదరు వేంకటరామారెడ్డి ఓ.బి.ఇ.గారు, రాజా పన్నాలాలుగారు మౌ. అబ్దుల్ వాహద్ బళేవి (పురపాలకసంఘ ఉపాధ్యక్షుడు) ఇంకనెందరో స్వయముగ హారముల మృతమహాశయునకువేసి గౌరవించిరి. శ్రీయుత కాశీనాథరావు వైద్య, ఎం.ఏ.ఎల్.ఎల్.బి [కాబోవు ప్రజాపక్ష విద్యా మహాసభాధ్యక్షుడు]. మౌ. సిరాజుల్ హసన్ తిర్మిజీ సా॥ హైకోర్టు వకీలు, వినాయకరావు విద్యాలంకారు ఎల్.ఎల్.బి బారిస్టరు, అబ్దుల్ మహమ్మదుసా॥ బళేవి, మా. హనుమంతరావు, శ్రీనివాసరావు శర్మ బారిస్టరుగార్లు కీర్తిశేషుని గుణగణములను స్తోత్రి పొగడి, తమదుఃఖమును ప్రకటించిరి! శ్రీయుతులు రామచంద్రనాయకు బారిస్టరు, విశ్వనాథనాయకు, లక్ష్మణనాయకులు (కీర్తిశేషుని సోదరపుత్రులు) శ్రీధరనాయకు బి.ఏ.బారిస్టరు [కీర్తిశేషుని కుమారుడు] వెంటనుండి దుఃఖసాగర నిమగ్నులైయుండిరి. వేలకొలదిగావచ్చియుండిన జనులు దుఃఖాశ్రువులరాల్చుచుండిరి! ఫోటోలు పలుమారులు గైకొనబడినవి!

### నాలుగుగంటలతరువాత

అచ్చట గుమిగూడినవారియెదుట కీర్తిశేషుని గౌరవించిన సంస్థలపేర్లు చదివివినిపింపబడెను, పిమ్మట ప్రేతయాత్ర అచ్చటినుండి వేలకొలదిజనులు వెంటరాగా బయలుదేరెను. శవమునకుముందు సుమారు వందమంది ఆర్యసమాజికులును, ఆర్యసామాజికురాండ్రును, వేదమంత్రముల ఉచ్ఛైస్స్వరమునతో పఠించుచు ముందునకుసాగిరి ఆవిధముగా సుమారు నాలుగు గంటన్నరవరకు సాగిన యీజనసమూహము నగరములోని బ్రాహ్మలబావి, రెసిడెన్సి, అబిదుసావు మార్గమున, ఫతేమైదానము ప్రక్కనుండి, ఖైరతాబాదుమీదుగా బేగంపేటరోడ్డుపైకి పోపన్నపేట రాణీగారిబంగ్లాకు ప్రక్కనుండి పోడిమార్గమున వారితోటలోనికివచ్చువరకు రాత్రి ఏడుగంటలవేళయైనది! మార్గమున ఎన్నియోతావుల జనులు సంతాపముతోను, గౌరవముతోను అర్పించిన పూలహారములు కుప్పలుకుప్పలుగా శవముపైబడెను, వైదికధర్మోద్ధారకులగు ఆర్యసమాజిక సోదరసోదరీమణుల శ్రద్ధాభక్తులు మతభక్త్యుత్సాహము, వారి వేదమంత్రపఠనరూపమున మిన్నుముట్టుచుండెను. అనేకులు ముందుగనేవడచియు, మోటారులమీదను, బండ్లమీదనుపోయి దారిపొడవుననిలుచుండి కీర్తిశేషుని సత్కరించిరి! "వామననాయకునుజయ్"! అను నినాదములు మిన్నుముట్టుచుండెను.

### దహనసంస్కారము

రాత్రి ౭ గంటలవేళ ఈసంస్కారము సక్రమముగ, సమంత్రకముగజరిగెను, చితిపైన శవమునుపెట్టినతరువాత మంచిగంధపుచెక్కలు పేర్చబడినవి. రాత్రివేళయైనందున ప్రత్యేకముగ వెలుతురుసహాయమున ఫోటోలు తీసికొనబడినవి. రాజాబహద్దుర వ్యాంకమూర్తి విశ్వేశ్వరనాథు (హైకోర్టుజడ్జి) రాజా పన్నాలాలు బన్సీలాలు [కోటీశ్వరులు] రాజా శ్యామరాజ బహదరు (గొప్ప సంస్థానాధిపతి, సదరుల్ మహాం తామీరాత్) రాజాదోండేరాజ్, రాజా త్ర్యంబకరాజా మున్నగు గొప్పవారనేకులు చితిసమీపముననున్న వేదికపైకెక్కి కీర్తిశేషుని ముఖావలోకనము తుదిమారుచేసికొనిరి. అప్పుడు ఒకటిరెండు నిముషములసేపు వర్షపుచినుకులుపడెను! మహోదారుడగు వామననాయకునకు ఆకాశము కన్నీరుకార్చుచున్నదాయనువట్లు కానవచ్చెను. తరువాత వెంటనే వర్షమాగిపోయెను. జరుగవలసిన క్రియాకలాపముజరిగెను, కొన్ని నిమిషములలోనే అగ్నిజ్వాలలు ప్రజ్వరిల్లసాగెను! దాదాపు అరువదిసంవత్సరములు సార్థకనాముడై జీవించి, మహోదారుడని ప్రశంసజెంది, ఎందరినోపోషించి, ఎందరినో రక్షించి, దానకర్ణుడని ఖ్యాతిగాంచి, విద్యాప్రపాదకుడని వినుతిగాంచి, పత్రికలనుస్థాపించి, ఉద్యమములనారంభించి, మహావక్తగను కార్యశూరుడుగను, ఉభయవిధముల నిజామురాష్ట్రమున నిరుపమానమగు కీర్తిగాంచి, ఆంధ్రులలో ఆంధ్రుడై, మహారాష్ట్రులలో మహారాష్ట్రుడై, కర్ణాటకులలో కర్ణాటకుడై ఒక్కరివాడుఅని అనిపించుకొనక సర్వమత సమత్వము కలవాడై, పేదలకు పెన్నిదానమై, స్వర్ణాక్షరములతో వ్రాయదగిన స్వీయచరిత్రనునిర్మించిన దేశభక్త వామననాయకుని భౌతిక దేహము కానబడకుండపోయెను! పరమేశ్వరుడాతని ఆత్మకు శాంతిప్రసాదించుగాక!

తథాస్తు.




# గోలకొండ పత్రిక

భావనామ సం॥ ఆశ్వయుజ బ॥ ౧౪

గురువారము


## ఆంధ్రదేశమున తుపాను భీభత్సము

ఈ ఆశ్వయుజమాస శుక్లపక్షాంతములో బ్రహ్మాండమైనతుపాను ఆంధ్ర దేశముయొక్క ప్రాగ్భాగమును ఊపించి వదలిపెట్టినది ఈతుపానుచే నెల్లూరు జిల్లాచివరిభాగమునుండికాకినాడవరకును సముద్రమునకుకొంచెము సామీప్యమందుండు ఊళ్లన్నియు, గృహనష్టములవల్లను, జననష్టములవల్లను, పశునష్టములవల్లను, పంటలనష్టమువల్లను, వృక్షములు కూలుటవల్లను నానాబీభత్సము జరిగినది. గట్టిఇండ్లు వాకిళ్లులేని కూలినాలిచేసి బ్రతుకుబీదలు, కర్షకులును చెట్లనీడలుకూడ లేనందున ఎడవానలలో దిక్కులేక దేవుడాయని అల్లాడుచున్నారు ఈబాధ గుంటూరుజిల్లాలోని భాగములయందు అతిమచ్చరకాపకెక్కినట్లు తెలియుచున్నది

అఖిలభారత గ్రామపరిశ్రమ సంఘముయొక్క కార్యదర్శియగు జె సి కుమారప్పగారు దంపుడుబియ్యపుసంఘ వార్షికోత్సవమునకై ప్రథమమున తెనాలికివచ్చియుండి, అక్కడినుండి బాపట్ల, చీరాల, వేటపాలెము మున్నగుగ్రామముల నన్నిటిని గ్రామపరిశ్రమల పరిశీలన సందర్భమున చూచుచురాగా, తుపానుచే ఈప్రాంతములందు చేయబడిన వినాశము బీహారు భూకంపముకంటె ఎంచినట్లు వారికి నిస్సంశయముగ తేలినది మరీ ఇంతఎక్కువకష్టము అనితోచినది ఏలయన, బీహారు భూకంపములో ఇండ్లుపోయినను చెట్లుండెను, కాని ఇక్కడ చెట్లుకూడ పడిపోయి బాధితులుఎండలో మాడుచున్నారు బియ్యపు మరశాలలు చెడుటచే బియ్యముచవకైనవి ఈవిధముగ తినుటకు అన్నము, కట్టుకొనుటకు గుడ్డలు, శీతోష్ణబాధనుండి రక్షించుటకు ఇండ్లులేనిబాధ బీదలకే ఎక్కువ సంప్రాప్తమైనదని కుమారప్పగారనుచున్నమాట గమనించదగినది

ఈతుపానువలన మొత్తముఒకకోటి రూపాయలు నష్టమైనట్లు మదరాసుప్రభుత్వమువారు తలచుచున్నారు, కుమారప్పగారు అన్నిగ్రామములను చూడలేదు; అయినను తాముచూచినంతవరకే నష్టము ఒకకోటికిపైగా లెక్కయగుచున్నదని తలచుచున్నారు. ఈనష్టనివారణకై మున్ముందు పంటలవచ్చుటకు గాను రూ ౫౦ వేలును, పశువులమేతకై రూ ౫౦ వేలును, ఇండ్లకై ౭౫ వేలును, పరిశ్రమలచే జీవించువారల పనిముట్లకై రూ ౨౫ వేలును— మొత్తము సుమారు రూ ౨ లక్షలు వెంటనేకావలెనని కుమారప్పగారు తలచుచున్నారు ఈద్రవ్యమంతయు ఒక వేయినలుబడి వేల మైళ్ల వైశాల్యముగల భూప్రదేశములో ౭లక్షల జనాభాగల మూడువందల గ్రామములలో బాధపడుచున్నవారలకు అత్యవసరములని కుమారప్పగారితోకూడ సంచారముచేసిన గొల్లపూడి సీతారామ శాస్త్రిగారనుచున్నారు

ఇంత అవస్థలోనున్న బీదజనులకు చేతనైనంత సాహాయ్యమునంతెయు ఒనగుట కొద్దిగనైనను దైవముచే మంచిచూపు చూడబడుచున్నవారల ధర్మము బాధితుల సాహాయ్యార్థమై వస్తువులనుగాని, ద్రవ్యమునుగాని పంపదలచువారు "ఆంధ్రపత్రిక" పేర స్థాపించబడిన "తుపానునష్ట నివారణనిధి" పక్షమున శ్రీయుత దేశోద్ధారక కాశీనాథునినాగేశ్వరరావు పంతులుగారికి పంపవచ్చును ఇంతవరకుచూడగా, మదరాసుప్రభుత్వమువారు గుంటూరు కలెక్టరుగారివశమున నుంచిన రూ ౧౦౦౦౦లు, ఆంధ్రపత్రికనిధికి నవంబరు ౯వతేదివరకు వసూలైనరూ౬౦౦లు, గుంటూరు తుపాను బాధనివారణనిధికి వసూలైనరూ౨౫లు, హిందూపత్రిక పేర స్థాపించబడిన నిధికి వసూలైనరూ——ఇంతకంటె ఎక్కువ కనపడుటలేదు కనుక ఇతరప్రాంతములవారును వెంటనే కష్టదశయందు చిక్కియున్న సోదరదేశీయుల రక్షణభారము వహించవలసియున్నది

బీహారు భూకంపము వచ్చినపుడును క్వెట్టాభూకంపము వచ్చినపుడును, మన రాష్ట్రమందు ప్రభుత్వమువారును ప్రజలును సభలుచేసి ద్రవ్యము వసూలుచేసి ఆప్రాంత బాధితుల రక్షణకై పంపియుండిరి అప్పుడు అట్టి సహాయమును సంపాదించుటయందు శ్రద్ధబూనిన ప్రభుత్వమువారును, పలుకుబడిగల పెద్దలునిపుడును వెంటనే సాహాయ్యమును వసూలుచేసి బాధితులకు చేరునట్లు పంపుటకు శ్రద్ధవహించవలెను రాజాబహాదర్ వేంకటరామారెడ్డిగారు ఈహైదరాబాదునందు బీహారు భూకంపబాధా నివారణకై ఏర్పడినసంఘమునకును, క్వెట్టాభూకంప బాధిత రక్షణార్థ మేర్పడిన సంఘమునకునుగూడ కార్యదర్శిగనుండి చాల ఉపకారముచేసియుండిరి వారు ఇపుడును శ్రద్ధగైకొనదగును ఈ ఈతిబాధలో కలుగు నష్టము సాధారణముగా అందరికంటె బీదలకే ఎక్కువ తగులుచుండునను ఒక్కమాటను దృష్టిలో నుంచుకొని, జాతిమతభేదములులేక రాష్ట్రీయులందరు శక్తికొలది సహాయము చేయుట విధియైయున్నది.

---

ఏడవ ఆంధ్ర మహాసభ, మహిళామహాసభ

షాద్‌నగరం: (రైల్వేస్టేషను)

౧౫,౧౬,౧౭ బహామన్, ౧౩౪౬ ఫ. (మార్గశిరశు॥ ౨-౩-౪) తేదులలో జరుగును

అధ్యక్షుడు

**శ్రీయుత కొండా వేంకటరంగారెడ్డిగారు హైకోర్టువకీలు**

అధ్యక్షురాలు

**శ్రీమతి బూర్గుల అనంతలక్ష్మీదేవిగారు**

సోదర సోదరీమణులు సభయందు పాల్గొన ప్రార్థన

| | |
|---|---|
| ఆహ్వాన సంఘకార్యాలయము షాద్‌నగరం N S R. | వేంకట నారాయణరెడ్డి—అధ్యక్షులు, బూర్గుల వెంకటేశ్వరరావు-కార్యదర్శి |

---

## "దేశభక్తుని" నిర్యాణము

"దేశభక్త" వామన్నాయకుగారి నిర్యాణము వేలకొలదిమందిని విషాద సాగరమునముంచినది వారి వితరణశీలము, ప్రజాహితకార్యాసక్తి, "నీ""నా" అనుభేదములేని అతిథ్యభ్యాగత సత్కారము ఈహైదరాబాదునందు వారియండను అనేకదీనులకును, ప్రజాహిత సంస్థలకును, ఎండలోనడచు పథికులకు వితతశాఖావృక్షచ్ఛాయవలె జేసినవి బ్రిటిషు ఆంధ్రమండలమున విశ్వదాత నాగేశ్వరరావుగారెట్లో మన నిజాంరాష్ట్రమున వామన్నాయకుగారట్లు పరోజు చూచినను వారి ముక్తాశ్రమమందు చాదాపు ముప్పదిమందివరకు అతిథులకు, అభ్యాగతులకు భోజనములు జరుగుచుండెడివి. వారితోకూడ కలిసి భోజనము చేయనివారైన, సామానడిగి తీసికొని, ముక్తాశ్రమమందే(ఎన్ని యోగదులుండును) అందొకగదిలో వండుకొని తినిపోవచ్చును హైద్రాబాదుకు వచ్చు పండితులకు, పెద్దలకు ఆంధ్రమహారాష్ట్రభేదమేమియులేక అందరికిని ముక్తాశ్రమమందు సమానగౌరవము. వితరణవిషయము తీసికొనుడు, మరల మహారాష్ట్రకన్నడ భేదము కానరాదు, వామన్నాయకుగారి ముంజేయి మహారాష్ట్రుడని ముందుకురాలేదు, ఆంధ్రుడని వెనుకకు బిగదీసికొనలేదు, సనాతనులని ముందుకురాలేదు, ఆర్యసమాజీయులని వెనుకకుపోలేదు. నిజాంరాష్ట్రాంధ్రోద్యమ వికాసమునకు అపారమైన సేవజేసినవారు ఆదిహిందూ సాంఘిక సేవాసమితికిని, హరిజనసంఘమునకునుఅనేకవిధముల తోడ్పడిన వీరెక్కడిసనాతనులని ఎవరాశ్చర్యపడకుందురు? కాని వారు సనాతనులే అయితే ఇతరుల అభివృద్ధికి ఆటంకపడకపోవుటయేగాక స్వయముగా తోడ్పడునట్టి నిజమైన సనాతనులు. ఆర్యసమాజీయులలో ఆర్యసమాజీయునిగను, సంస్కర్తలలో సంస్కర్తగను, ఆంధ్రులలో ఆంధ్రునిగను ఉన్న ఈ మహారాష్ట్రసనాతనుడు హిందూ మహాసభాధ్యక్షులకు అన్నివిధముల తగినవారు. ...

## ప్రజాపక్ష విద్యా మహాసభ

హైద్రాబాదు, ౨౬—

ప్రజాపక్ష విద్యామహాసభ కార్యదర్శిగారిట్లు వ్రాయుచున్నారు —

హైసగలో పాల్గొను జిల్లాప్రతినిధులును మరియు ప్రేక్షకులును తమవిలాసములు సాధ్యమైనంతత్వరలో మా కార్యస్థానమునకు పంపిన, రైల్వే తగ్గింపురేట్లకై సభాఖులకు నామాను పంపుదుము ఈటిక్కెటు ౧౫ నవంబరు (౧౧౪౬ దై) తేదిలాగాయతు ౨౨నవంబరు ౧౯౩౬ (౧౫ దై ౧౩౪౬వరకు మాత్రమే అమలించును

మానుండి రశీదు పుస్తకములబడసి జిల్లాలలో సభ్యులకొరకు కృషిచేయుచున్న మా ప్రతినిధులు తాము తమకృషిని అదర్శప్రాయముగా చేయుటకై సాటుపడుచుండులుకోబడెను ద్రవ్యముతో సహా రశీదుపుస్తకమును దై ౧౩౪౬ తేదీ౧౩౪౬ ఫ సాయంత్రమువరకు ప్రజాపక్ష విద్యామహాసభ కార్యస్థానము జాంబాగు నంబరు (౨-౨౧౪) కు పంపగలరు

---

## హైద్రాబాదులో ప్లేగుగల వీధులు

హైద్రాబాదులో ఈదిగువ వీధులలో ప్లేగు గలదని ప్రభుత్వ ప్రకటనవారు ప్రకటించుచున్నారు

౧ షైరోజాలాల్‌దర్వాజ, ౨ అందరోజాలాల్ దర్వాజ ౩ సరోరునగర్, ౪, దారుష్షిఫా, ౫ లోయర్‌ధూల్‌పేట, ౬ చుడీబజారు, ౭, షైరూజా ఆలీఅబాదు ౮ ఉర్దూషరీఫు. ౯ సుల్తానుషాహీ సమీపములో భోయిగూడ ౧౦ రికాబ్‌గంజు, ౧౧, షైరూజా గౌలీపురము, ౧౨ పాతమలకపేట

---

రంతటితోకూడ నాగిక ఈరాష్ట్రపరిస్థితులలో సాధ్యమైనంతవరకు హిందువులకేగాక తదితరులకు సంబంధించినప్రజాహిత సేవయందుకూడ శ్రద్ధవహించుచుండిరి కాంగ్రెసులోపాల్గొనుచుండుట, పురపాలకసంఘమందు వారిపని ఇందులకు నిదర్శనములు. అట్టిమహాశయుని వియోగమునకై ఏమింతుగని బీదజనులుగూడ అనేకులు మున్న ఫిషేషర్ధని ఘోషరువద్ద అంత్యదూపు సందర్శనమునకై వచ్చి కన్నీటితొట్టు కార్చుచ ఉన్నదనే తపోయుల. భగవంతుడు వీరి కీర్తిని తన్నుని శాంతిప్రసాదించుగాకని తనముఖములో కీర్తి తెలుపు బంధుగులకు మాసానుభూతి తెలుపుచున్నాము.

## సీతాఫలములపైపన్ను

హైదరాబాదు, డై౹౨

సీతాఫలములు అడవిసందులుగా భావించి, ౧౩౪౧ ఫసలీలోని ౧౦౨ గస్తీద్వారా పీటి పై మరకపుగాఖ (కర్వడ్గిరి) వారి పన్నువేయుట చేసియుండిరి. కాని, ఈపండ్లు విదేశములకు మిక్కిలిగా దిగుమతిఅగుచుండుటచే వాడు వీటిని నెలగలపండ్లతో సమానముగా ఎక్కువ ధరలతో వికయించుచున్నారు ఈకారణముచే మనరాష్ట్రప్రజలకు ఇవి తృప్తిగను, చౌకధరలలోను లభించుటలేదు ఈవిషయమైలగురకపుగాఖ అధ్యక్షులవారు ప్రభుత్వముఖాకి తెలుపుచు, దిగుమతిఅగుపండ్లపై మాటికి రు ౧౫లు సుంకము విధించవలసినదిగా కోరినప్రకారము ప్రభుత్వముపారు అనుమతించినటుల ప్రభుత్వప్రటనలవలనను తెలియుచున్నది

## శ్రీరామకృష్ణాంధ్రభవరసాలయజననము

[విశేషం]

తెర్లమద్ది ౨౦ అజూరు ౧౩౪౬

ఈరోజు విజయదశమినాడు ఇక్కడ కవిపూజజరిగినతర్వాత శ్రీయుత క మురళీధరరావుగారి అధ్యక్షతన ఒక సమావేశముజరిగి అందుపై పఠనాలయము స్థాపించబడినది సమావేశమున పాల్గొన్నవారలందరును ఖద్దరువస్త్రములను ధరించియుండిరి. ఈపఠనాలయ యామమాన్యమున ప్రతిశుక్రవారము దైవభజన వార్తాపత్రికలుచదివి వివిధించుట, మద్యపానవిషధము ఖద్దరువస్త్రధారణ మున్నగునవి బోధించుట— వీటికి ఏర్పాట్లుజరిగినవి, ఈపఠనాలయోత్పత్తికికారకులైన కలకొండ బుచ్చిరాంరావుగారు గోలకొండపత్రిక ఉచితముగా నిచ్చుటకు అంగీకరించుటయేగాక రాజపోషకులుగ నుండుటకును అంగీకరించిరి శ్రీయుత క గోపాలరావుగారు ఖద్దరుమాత్రమే వాడుటకు ప్రతిజ్ఞ చేసిరి చాకలిమాదేలగు పీరమల్లు మద్యపానముమానుటకు ప్రతిజ్ఞచేసెను

---

నిజాంరాష్ట్రములో ప్రభుత్వ పద్ధతి యెట్టిది?
కౌన్సిల్ అధికారముల లేమి?
మాల్గుజారీ మున్నగు కచ్చేరీల వ్యవహార మెట్టిది?
సర్ఫెఖాసనగా నేది?
రెసిడెన్సీ చరిత్ర విన్నారా?
జాగీరు, పాయగా సంస్థానముల సంగతి తెలియునా?
రాష్ట్రజనాభా, విద్యాస్థితి, శాసనసభ వేమేల సర్వవిషయము మీ రెరుగుదురా?

ఎరుగకున్న

### "నిజాం రాష్ట్ర పరిపాలనము" చదువుడు

౧౦౦ పుటలు — ధర ౬ అణాలే.

కొంతకాలములో ప్రతులన్నియు ఖర్చైన వారల విచారించిన ఫలమేమి?

రెండుప్రతులకన్న ఎక్కువతెప్పించువారికి వీ పీ గా పంపబడును ఒక్క ప్రతికోరువారు టపాటికెట్లు పంపవలెను

---

## సెంటినెల్

### రక్షణకు ఉత్తమమైన కంపెనీ

1 దాని ఏజన్సీ శాశ్వతపు రిన్యూయల్ కమిషనులును, మొదటిసంవత్సరము నకు చాల ఎక్కువ కమిషను యివ్వబడును.
2 బీదలకు ధనికులకు వీలగు అనేక పద్ధతులు
3 ఇతరకంపెనీలకు పోల్చినయెడల మిక్కిలి పోటీ ప్రీమియములు పలుకుబడిగల

చీఫ్ ఏజంట్లు అండ్ ఆర్గనైజర్లు హైదరాబాదుకును, ఆకర్షణీయమైన పద్ధతులమీద కావలయును

వివరములకు

The Sentinel Assurance Co, Ltd,
Sir Phirozshe Mehta Rd Fort Bombay

---

## గ్లోబ్ కాంపిటిషన్

### రు 12000 గెలుపొందుడు

తక్షణం

గ్లోబ్ కాంపిటీషన్   గ్లోబ్ కాంపిటీషన్

### క్రాస్‌డిజిట్సు కాంపిటిషను నెం 1

ఎక్కువ జవాబులు పంపినవారికి ప్రత్యేక బహుమతి రు 2000 సరియైనజవాబు వెస్టర్న్ బ్యాంకు ఆఫ్ ఇండియా లిమిటెడ్ వారివద్ద యుంచబడిన మార్కీసాల్యూషనుతో ప్రతి అక్షరమును సరిపోవలయును

ప్రవేశరుసుము రు 1 ఒకప్రవేశమునకు

ఆఖరుదినము 20—11—36   ఫలితదినము 25—11—36

1 పోటీసందర్భములలో బహుమతిడబ్బు ఎడిటరుగారియిష్టప్రకారము సమానముగాపంచియివ్వబడును అప్పుడు గెలిచినవారికొక్కొక్కరికి ఒకేబహుమతివచ్చును

2 1మొదలు 16వరకుఅంకెలను యీచదరము లో ఏవరుసగాని కోణములలోగాని కూడిన 34వచ్చునట్లు చేయుము ఒక్కొక్క అంకె ఒకేపర్యాయము వాడవలయును ఏన్నియైనప్రవేశములు పంపవచ్చును

3, మనియార్డరుగాని పోస్టలుద్వారాగాని ప్రతిప్రవేశమునకు రు 1 పంపవలెను

4 ప్రవేశములన్నియు సిరాతోగాని, టైపుచేసిగాని వ్రాసిపంపవలయును పెన్సిలు పనికిరాదు

5 ఫలితములు 25 నవంబరు 1936న తెలుపబడును అవి ఒకఅణాబిళ్లతో తమఅడ్రసును యిచ్చినవారికి వ్రాసిపంపిన వారికిపంపబడును. ప్రవేశములతో పాటు రు పంపవలెను

6 ప్రవేశములన్ని టి బహుమతులు పూర్తిపోవున్న సరియైన జవాబులు [illegible] పంపబడును.

గ్లోబ్‌కాంపిటేషన్ నెం 1
కూపన్

ఈపోటీలో చేరుటలో కాంపిటిషన్ ఎడిటరుగారి తీర్మానము వకు న్యాయరీత్యా బద్ధుడనై యుందునని ఒప్పుకొనుచున్నాను

పేరు
Mr
Mrs
Ms
అడ్రసు
పోస్టల్ ఆర్డర్ నెం
కూపన్ నెం

దీనిని కత్తిరించి మనియార్డరుతోగాని, పోస్టలు ఆర్డరుతోగాని పంపవలెను,

7 ప్రవేశములు పోయినను, ఆలస్యమైనను మా పూచీలేదు ఉత్తరప్రత్యుత్తరములుగాని, సంభాషణలుగాని జరుపబడవు ఎడిటరుగారి తీర్మానములు న్యాయరీత్యాబాధ్యములు

8 ఏసందర్భములోగాని, ప్రవేశరుసుములు వాపసుయివ్వబడవు

9 కూపన్లుచుట్టును కత్తిరించిగాని, తెల్లకాగితముమీదగాని పంపవచ్చును దిద్దుళ్లు తుడుపులు వల్లబడవు ఒకప్రవేశముకంటె ఎక్కువగా పంపువారు వరుసగానెంబర్లు వేయవల్లయును

10 ఈనిబంధనలకు వ్యతిరేకించిన ప్రవేశములు చెల్లనేరవు

11 తెల్లకాగితములమీద ప్రవేశము పంపువారుగూడ ఎడిటరుగారి తీర్మానములకు బద్ధులుగావలయును

నిబంధనలు గ్రస్తగా చదువుడు

మీప్రవేశములు, ఫీజులు యీక్రింది వారికి పంపవలెను —

To The Competition Editor
**The GlobeCompetition"**
Bunder Road KARACHI.

---

## స్వాములగారి పర్యటనము

స్వాములగారు ఈనెల ౧౨వ తేది సుమవారమునాడు బరంపురమునుండి బయలుదేరి ౧౨, ౧౩, ౧౪ తేదులలో ఆంధ్రదేశము-విజయనగరము, బొబ్బిలి పిఠాపురము, రామచంద్రాపురము మున్నగు ఆంధ్రదేశసంచారము చేయుదురనియు, ౧౫ తేది రాయమాలునకుచేరెదరనియు తెలియుచున్నది

---

### "ఉచితము"

1 కుటుంబసంరక్షణి వెల రూ1 0-0
త్రిదోషహరములగు మూడు దివ్యౌషధ (రాజములు ప్రతియింట వుండదగినవి)

2. మహాభృంగామలకతైలం 1 0 0
నేత్ర శిరోవ్యాధులకు

3 మాదీఫలరసాయనము 1-0 0
సర్వపైత్య వికారములు పోగొట్టును

4. రత్నపురుషలేహ్యము 1-0-0
"లాట్ ఖాయా శేటాదుర్త న్"

5 శివామృతము 1.0-0
ఇదిశుక్లనష్టము నరములదుర్బలత్వమును పోగొట్టును

### "జాతకము"

పుట్టినతేది గంటలు లేక గడియలు వ్రాసినయెడల ద్వాదశభావములతోసహా జాతకము వ్రాసిపంపబడును ౫ సం॥ ఫలములతో జాతకము రూ ౫ లకు వ్రాయించుకొన్నవారికి పై ౫ మందులలో నొకటి యుచితము పై నుదహరింపబడిన ౫ మందు లొకేసారి కొను వారికి ఒక్క సంవత్సరము జాతకము మూపమువారిగా నుచితముగా వ్రాసిపంపబడును

అడ్రసు—
6464, పండితాశ్రమము
సికింద్రాబాదు

---

## కలరా కలరా కలరా

భయములేదు   భీతిజెందకుడు

కలరాకు దివ్యౌషధము

**విక్టర్‌డ్రాప్స్** మిమ్ము కాపాడగలదు.

గ్రహణి, అతిసారము, కలరా రక్తవిరేచనములు, కడుపుబ్బరములు అజీర్ణము వాంతిభేదులు మొదలగువాటిని తప్పక కుదుర్చును రెండు మూడు మోతాదులు పుచ్చుకొనినచో కలరావలన కలుగు వాంతిభేదులుకట్టుకొనును అనేకులు మావిక్టర్‌డ్రాప్సు ఉపయోగించి ప్రాణముల కాపాడుకొని యోగ్యతాపత్రముల నొసగియున్నారు కలరావ్యాధులకు వాడబడుచుండు ఔషధములలోకెల్ల మావిక్టర్ డ్రాప్స్ ప్రశస్తమైనదని డాక్టరులు పొగడియున్నారు మరియు అన్ని వయసులవారికి నిర్భయముగా వాడవచ్చును

సోల్‌యెజంట్లు విక్టర్ అండు కో
పెద్దగడియారం హైద్రాబాద్ దక్కన్
దవాఖాన, విక్టర్ అండుకో
సుల్తానుబజారు

---

## సహారా ఎక్‌స్ట్రా




శుభ్రమైన నున్న నిక్షౌరములకొరకు సహారా ఎక్‌స్ట్రాబ్లేడును వాడుడు

౫ బ్లేడ్లు గల పాకెట్ వెల 4 అణాలు

పోస్టుబాక్సు నెం. 154. బొంబాయి.

ఇంకొకచట్టము

# వింతలు విశేషములు

### నోటుపండ్ల జప్తు

ఎట్టిశక్తియులేని అమెరికాన్ నీగ్రో యొకడు కోర్టునకయివ్వవలసిన పైకము వానియొద్ద లేమిచే వాడు కట్టించుకొనిన వజ్రములపండ్లను రెండిటిని జప్తుచేసిరి

### కొడుకునుచంపి తినినస్త్రీ

ఒక జర్మనీయువతి నాలుగు నెలలలోపల నుండు బిడ్డనుచంపి మాంసమును వంటచేసికొని తినెను ఈవార్త తెలిసి పోలీసువారు విచారించగా వంటయింటిలో బాలునిశిరస్సు మాంసము దొరికినవి ఆస్త్రీని అరెస్టుచేసి కోర్టుకెక్కించిరి విచారణజరుగుచున్నది

### ౩౦ ఏండ్లనాటి శవము

దేశభ్రష్టుడగు రూసు రాకుమారుడు ప్యారిసు హోటలులో కొన్నాళ్లు బసచేసియుండెను ఆతనివెంట నొకపెద్దట్రంకుపెట్టెయుండెడిది, అతడెప్పుడును ఆపెట్టెను వదలియుండలేదు హోటలులో బసచేసినకొన్నాళ్లకు అటనుండి పెట్టెవిడిచి బయలుదేరి ఎచటికో వెళ్లెను చాలా రోజులతర్వాత ప్యారిసు హోటలుయజమానికి "ఆపెట్టెలోనివస్తువులనమ్ముకొని నీకునేనివ్వవలసినడబ్బుక్రింద చెల్లుపెట్టుకోవలసినది" అని కజాబువ్రాసెను ఆయజమాని పెట్టె తెరచిచూడగా దానిలో నొకబాలునిశవముండెను ఈశవముయొక్క పెదవులు సజీవులపెదవులవలెనే యుండెను ఈబాలుడు మరణించి ౩౦ సంవత్సరములుజరిగినవని పరీక్షచేసి డాక్టరుచెప్పెను

### సైకోగాల్వెనోమీటర్

న్యూయార్కులో ఫోర్డుహాం విశ్వవిద్యాలయపు మనస్తత్వశాస్త్రశాఖయొక్క అధ్యక్షులగు ఫాదర్ వాల్టర్ జి సమ్మర్సు, యస్ జె పి హెచ్ డి గారు అసత్యములనుకనుగొను ఒక యంత్రమును నిర్మించగల్గిరట దానిపేరు సైకోగాల్వెనోమీటరట మానవునిలో వసియించునవయంతయు విద్యుచ్ఛక్తిస్వరూపమేయనునది నిర్ణీతమైనదికదా శరీరములో ప్రసరించు విద్యుచ్ఛక్తిప్రవాహగతిని ఈయంత్రము సూచించగలిగి ఒక రేడియోయంత్రమువలె నుండును. ఎవరు అసత్యము చెప్పెదరో అనుమానముగలదో ఆతనిని రెండు యలెక్ట్రోడులను పట్టుకొనునట్లు చేయవలెను సాధారణముగా అసత్యము చెప్పినవాడు పరీక్షించబడునప్పుడు భయముపొందియుండునుగదా? కనుక హృదయములోపల అదరుదల ఎంతచిన్నదైనను యీయంత్రమందలి ఒకసూదిచే ఒకచార్టుపై వ్రాయబడుచున్నది ఆసత్యము ఎంతగొప్పదో [అనగా చెప్పినవానికి ఎంతతలవంపులని పెంచునదో] అనునదిఅంత అగపడును

### పరమాణువుల ఫోటోతీయుకెమెరా

బ్రిటనులో సౌత్ కెన్సింగ్టనులో "ఇంపీరియలు కాలేజ్ ఆఫ్ సైన్సు" అను సైన్సుకళాశాలలో పరమాణువుల ఫోటోతీయగల కెమెరా స్థాపించబడినది ఇదిమొదలు చమురులయొక్క తత్వములను కనుగొనుటకై స్థాపించబడినది యింజనులచే బరువులాగించునప్పుడు ఆ ఇరుసు కొంత పరిమాణనిర్ణయము దాటునపుడే అంతకు ముందు యింజనుభాగములు గరగరలేకుండునట్లు తిరుగుటకై వేయబడియుండు చమురుయొక్క పరమాణువులు వరుసగా నిలచియుండునని — అట్లాబ్రొటింగు అనువారు కనుగొనిరి [illegible] యొక్క సైజు ఒకప్రమాణముదాటకముందు పరమాణువులు వికటముగా నుండునని యు ఒకవు అంతకుమించగానే అవి వంగినవట ఆచమురులో బ్యాక్టీరియా చేయు గుణము నశించుచున్నదనియు కెమెరాతో కనుగొనబడినది ఇప్పుడు ఎక్కువకాలము వంగకుండ నిలువబడగలిగినట్టి రేకు, అచమురులో చక్కగా కలిసియుండిగలిగినట్టియు ఏపదార్థముయొక్కగాని పరమాణువును కనుగొనుటకై యత్నించుచున్నారు

### భూమి రోజురోజుకు లావెక్కుచున్నది

పార్డ్యూకళాశాల పరిశోధనాలయములో [లాబొరేటరీ] పనిచేయు డాక్టర్ జె యం గ్రీన్ స్ట్రీటుగారు భూమి సార్థ్యనిరూపణమును పరిచారము చేయుటలో ౫౦ ౧ కి ఒకపౌండుచొప్పున లావెక్కుచున్నట్లు తమ పరిశోధనలచే లెక్కచేసినారు ఈలావెక్కుట చుక్కలురాలునపుడు భూమిపైపడు ఇనుపముక్కలవలనను రాళ్లవలనను సంభవించుచున్నదట

### ౧ గంటలో ౯౦౦౦ చెక్కుల సంతకము

అమెరికా సైంటిస్టు ఒకడు ఒక విచిత్రయంత్రమును కనుగొనినాడు ఈయంత్రములో ౧౨ పేనాలుండును చెక్కులపై సంతకము చేయవలసిన వానితోకూడ ఈ ౧౨ పేనాలును సంతకముచేయును నిమిషము ౧ కి ౧౨ సంతకములు చేయవచ్చునని లెక్కించుకొన్నను గంటకు ౯౦౦౦ చెక్కులను ఈయంత్రము సహాయ్యముతో సంతకముచేయవచ్చును.

### సూర్యునినుండి పెద్దమంట

కొన్నివారములక్రిందట ఫిలడెల్ఫియాలో నక్షత్రమండల పరిశోధనాలయములో మిక్కిలి నవీనమైన యంత్రముతో పరిశీలించగా సూర్యబింబమునుండి పెద్దమంటవచ్చినట్లు కనుగొనబడెనట ఆమంట ఇంకకొంచెము దాటినట్లైతే భూమి కాలిపోయి యుండవలసినదట దానినిగురించి ఇంకను పరిశోధించుచున్నారు

---

